బాలవిజ్ఞానగ్రంథమాల. 3.

# శతకపద్యమంజరి.

(నాల్గవ తరగతి.)

(పద్యావాచకము.)



సంపాదకుఁడు

విమర్శాదక్షక

నడకుదుటి వీరరాజకవి

పిఠాపురము.

 [వెల 0—2—6.

# పీఠిక.

దేశభాషాభివృద్ధికిఁ బూర్వవాఙ్మయమే పునాదివంటిది. మేధాశక్తిని బెంపొందించుటకు మనపూర్వులు మొన్నమొన్నటిదనుకఁ బద్యగ్రంథములనే రచించుచు వచ్చిరి.

విద్య నభ్యసింపఁ గోరు బాలురును, బాలికలును బాల్యమునుండియు నలవఱచుకొనవలసిన సుగుణములలో నీతియు, దైవభక్తియుఁ బ్రధానములైనవి. మేధాశక్తితోపాటు పై సుగుణములను బెంపొందించుటకు మనపూర్వులు, మనోహరముగను, జాతీయముగను, నిత్యానుభవజ్ఞాపకములుగను నుండునట్లు, సులభశైలిని రచియింపఁబడిన శతకములు పెక్కులగు వానిని దొలుదొలుతఁ దమతమ బిడ్డలచే పఠింపఁజేయుచు వచ్చిరి. ఈయాచారము మొన్నమొన్నటిదాఁక వీధిబడులలోఁ బ్రాచుర్యముగ నుండెడిది. ప్రాథమికపాఠశాలలు నెలకొల్పఁబడిన ప్రథమదినసములలోసైత మప్పటి యుపాధ్యాయు లితరపాఠ్య పుస్తకములతోపాటు భాషాభివృద్ధికరములగు పద్యగ్రంథములను ప్రధానాంగముగ వాడుచువచ్చిరి.

కాలక్రమమున నాపద్ధతి మాఱి, యిప్పటిప్రధానపాఠ్య గ్రంథములలో (వాచకములలో) నేవియో కొన్ని పద్యములు

మూలాత్రము కడపట చేర్పఁబడునాచారమే వ్యాపించినది. కాని, యది పిల్లలభాషాజ్ఞానాభివృద్ధికిని, ననుదినజీవితానుభవమున కును దగినంతసాధకముగాఁ గనఁబడకున్నది. దానంజేసి నా మిత్రులగు కొందఱు స్థానికాధికారులయు విద్యాధికారులయుఁ బ్రోత్సాహమున పూర్వశతకాదివాఙ్మయమునుండి యాయా తరగతుల విద్యార్థుల కనుకూలములుగ నుండునట్లు పద్యముల నేర్చి కూర్చి 'శతకపద్యమంజరి' యను పేరితో నైదుపుస్తకములుగఁ బ్రకటించితిని.

విద్యాశాఖాధికారులును, దేశభాషాభిమానులగు స్థానికవిద్యాధికారులును నాయీపరిశ్రమమునకుఁ దగిన ప్రోత్సాహము నొసఁగఁగూర్తురని విశ్వసించుచున్నాఁడను.

ప్రకాశకుఁడు.

# విషయసూచిక.





# శతకపద్యమంజరి

మూఁడవ భాగము.

## ౧ వేమన శతకము

ఆ. కులములో నొకండు గుణవంతుఁ డుండెనా
కులము వెలయు వానిగుణముచేత
వెలయువనములోన మలయజం బున్నట్లు
విశ్వదాభిరామ! వినుర వేమ! 1

ఆ. నీటిలోన నోడ నిగిడి తిన్నఁగఁబాఱుఁ
బైట మూరెఁడైనఁ బాఱలేదు
నెలవు దప్పుచోట నేర్పరి కొఱగాఁడు
విశ్వదాభిరామ! వినుర వేమ! 2

క. తనమది కపటము గలిగినఁ
దనవలెనే కపటముండు దగ జీవులకుఁ
దనమది కపటము విడిచిన
తన కెవ్వఁడు కపటి లేఁడు ధరలో వేమా!

ఆ. ఎఱుఁగువానిఁ దెలుప నెవ్వఁడైనను జాలు
నోగుఁ దెలుపజగతి నోరులవశమె ?
ఏటి వంక దీర్ప నెవ్వని తరమయా
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 4

ఆ. మాటలెల్లఁ గల్ల మనసెల్ల దొంగయే
ఏటిపాత్రిణ మింక నెట్టి బ్రిదుకు?
మాట సత్యమైన మరి శతాయుష్యంబు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 5

ఆ. తీర్ప నార్పలేని తీర్పరి తన మేల?
కూర్ప విప్పలేని నేర్పదేల ?
పెట్టిపొయ్యలేని పెత్తనం బదియేల ?
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 6

ఆ. తాను గుదువలేక తగ వేది యాప్తులఁ
జేరనియ్యనట్టి చెనటినరుఁడు
పొలములోన దృష్టిబొమ్మకు సరితాఁడె ?
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 7

ఆ. ఇనుము విఱిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతుకనేర్చుఁ గమ్మరీఁడు;
మనసు విఱిగెనేని మఱియంటనేర్చునా?
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 8

ఆ. నీళ్లలోని చేఁప నెఱిమాంస మాశించి
గాలమందుఁ జిక్కి కూలినట్లు
ఆసఁజేసి మనుజుఁ డనయంబుఁ జెడిపోవు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 9

ఆ. ఉసురులేనితిత్తి యుసుమంత యూఁదినఁ
బంచలోహములును భస్మ మౌను;
పెద్ద లుసురుమన్నఁ బెనుమంట లెగయవా
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 10

ఆ. తేనెతెరలజాడ తేనెటీఁగ యెఱుంగు
సుమరసంబుజాడ భ్రమర మెఱుఁగు
జ్ఞానధనముజాడ సాధు వెఱుంగును
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 11

ఆ. మాట దిద్దవచ్చు మది నెగ్గు లేకుండ
దిద్దవచ్చు ఱాయి తిన్నగాను
మనసు దిద్దరాదు మహి నెంతవారికి
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 12

ఆ. పాలఁ గలియు నీరు పాలయి రాజిల్లి
యవియుఁ బానయోగ్య మైనయట్లు
సాధుసజ్జనముల సాంగత్యమునఁ జేసి
మూఢజనుఁడు సుగతి మొనయు వేమ ! 13

క. ధన మెచ్చిన మద మెచ్చును
మద మెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధన ముడిగిన మద ముడుగును
మద ముడిగిన దుర్గుణంబు మానుర వేమా ! 14

ఆ. తరువఁ దరువఁ బుట్టుఁ దరువున ననలంబు
తరువఁ దరువఁ బుట్టు దధిని ఘృతము
తరువఁ దరువఁ బుట్టు దలఁపున జ్ఞానంబు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 15

ఆ. ఎడ్డెఁ దెల్పవచ్చు నేఁడాది కైనను
మానిఁ దెల్ప వచ్చు మాసమునకె
మొప్పెఁ దెల్పరాదు మువ్వదేండ్లకు నైన
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 16

ఆ. ఔ నటంచు నొక్కఁ డాడినమాటకుఁ
గా దటంచుఁ బలుక క్షణముపట్టు
దాని విలువఁ దీయఁ దాతలు దిగవలె
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 17

ఆ దాన మరసిచేయు దాత దగ్గఱఁ జేరి
వక్రభాషణములఁ బలుకు మొఱకు,
చందనతరువందు సర్పముండినరీతి
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 18

ఆ. శ్రవణపుటములున్న సార్థక్య మేమిరా
వినఁగవలయు వెన్దలనెసి వన్ని,
వినఁగ వినఁగ మేలె విశద మాచుండును
విశ్వదాభిరామ! వినుర వేమ! 19

ఆ. పికము వనములోనఁ బెల్లుగాఁ బలికిన
భంగి ప్రాజ్ఞజనుల పలుకు లుండు,
కాకిగూఁతఁ బోలుఁ గలుషాత్మువచనంబు
విశ్వదాభిరామ! వినుర వేమ! 20

ఆ. బహుళకావ్యములను బరికింపఁగావచ్చు
బహుళశబ్దచయము పలుకవచ్చు
సహనమొకటి యబ్బఁ జాలఁగష్టంబురా!
విశ్వదాభిరామ! వినుర వేమ! 21

ఆ. మున్ను నిన్నుఁ గన్నముఖ్యు లెవ్వరో వారి
సన్నుతించి పిదప సంతతమును
జ్ఞానదాతఁ గొల్చి సన్మార్గ మెఱుఁగుమీ
విశ్వదాభిరామ! వినురవేమ! 22

ఆ. విద్యలేనివాఁడు విబుధులసభలోన
నుండఁగానె పండితుండు గాఁడు,
కొలన హంసలకడఁ గొక్కెరయున్నట్లు
విశ్వదాభిరామ! వినుర వేమ! 23

ఆ. కనకపర్వతమునఁ గాపురంబుండిన
నమరవిభునకైన నానపోదు
కనకకుండలములు కర్ణు ధరింపఁడా ?
విశ్వదాభిరామ! వినుర వేమ! 24

ఆ. పుత్త్రుడి గలవానిపుండు బాధయుఁ గూడ
వసుధలోనఁ జాల వార్త కెక్కు,
పేదవానియింటిపెండ్లైన వెలయదు
విశ్వదాభిరామ! వినుర వేమ! 25

ఆ. గుణములు గలవానికుల మెంచఁగానేల?
గుణము కలిగనేని కోటిసేయు,
గుణము లేకయున్న గుడ్డిగవ్వయుఁగాదు
విశ్వదాభిరామ! వినుర వేమ! 26

ఆ. గుణయుతునకు మేలు గోరంతచేసినఁ
గొండ యగును వానిగుణముచేతఁ
గొండయంత మేలు గుణహీనుఁ డెఱుఁగునా?
విశ్వదాభిరామ! వినుర వేమ! 27

ఆ. జనుఁడు తెలివినొందఁ జాంచల్యము నశించు,
దయయు నీతిగలుగఁ దగులు బుద్ధి,
తిగ్మభానుఁ జూచి తిమిరంబు నిల్చునా ?
విశ్వదాభిరామ! వినుర వేమ! 28

ఆ. జక్కి నెక్కి వీథిఁ జక్కఁ బోయెడువానిఁ
గుక్క లెన్నొ వెంటఁ గూయఁదొడఁగు,
ఘనుని కోర్వలేని కాపురుషులు నిట్లె
విశ్వదాభిరామ! వినుర వేమ! 29

ఆ. రాముఁడొకఁడుపుట్టి రవికులం బీడేర్చెఁ;
గురుపతియును బుట్టి కులముఁ జెఱిచె,
నిలను బుణ్యపాపములరీతు లిట్టివి
విశ్వదాభిరామ! వినుర వేమ! 30

ఆ. క్షమగలట్టియతఁడు సాధువై శోభించు
నోర్పుఁ బోలునట్టి దుర్విఁ గలదె ?
పన్నివచ్చు మేలులెన్నియైనను గాదు
విశ్వదాభిరామ ! వినుర వేమ ! 31



# శ్రీ సుమతి శతకము

క. అధరము గదలియుఁ గదలక
మధురములగు భాషలుడిగి మౌనవ్రతుఁడౌ
నధికారి రోగపూరిత
బధిరాంధకశవముఁ జూడఁ బాపముసుమతీ. 1

క. అప్పుగొని చేయువిభవము,
ముప్పునఁ బ్రాయంపుటాలు, మూర్ఖునితపముం
ద ప్పరయని నృపురాజ్యము,
దెప్పరమై మీఁదఁ గీడుఁ దెచ్చుర సుమతీ. 2

క. ఆఁకొన్న కూడె యమృతము
తాఁ గొంకక యిచ్చువాఁడె దాత ధరిత్రిన్
సోఁకోర్చువాఁడె మనుజుఁడు
తేఁకువ గలవాఁడె వంశతిలకుఁడు సుమతీ. 3

క. ఇచ్చునదె విద్య, రణమునఁ
జొచ్చునదే మగతనంబు, సుకవీశ్వరులన్
మెచ్చునదె నేర్పు, వాదుకు
వచ్చునదే కీడుసుమ్ము వసుధను సుమతీ. 4

క. ఉదకము ద్రావెడుహయమును
మదమున నుప్పొంగుచుండు మత్తేభంబున్
మొదవుకడనున్నవృషభముఁ
జదువని యానీచుకడకుఁ జనకుర సుమతీ. 5

క. ఉపమింప మొదలుతియ్యన
కపటం బెడనెడను జెఱకుఁ గైవడి నేపో,
నెపములు వెదకును గడపటఁ
గపటపు దుర్జాతిపొందు గదరా సుమతీ. 6

క. ఏఱకుమీ కసుగాయల
దూఱకుమీ బంధుజనుల దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువునాజ్ఞ మేదిని సుమతీ. 7

క. ఒకయూరికి నొకకరణము
నొకతీర్పరి యైనఁగాక నొగిఁ దఱుచైనం
గకవికలు గాకయుండునె
సకలంబును గొట్టువడక సహజము సుమతీ. 8

క. కప్పకు నొరగాలైనను
సప్పమునకు రోగమైన సతి తులువైనన్
ముప్పున దరిద్రుఁడైనను
తప్పదు మఱిదుఃఖమగును తథ్యము సుమతీ. 9

క. కరణముఁ గరణము నమ్మిన
మరణాంతక మౌనుగాని మనలేఁడు సుమీ
కరణము తనసరికరణము
మఱి నమ్మక మర్మమీక మనవలె సుమతీ. 10

క. కారణము లేని నగవును
పేరణములు లేని ప్రేమ పృథివీస్థలిలోఁ
బూరణము లేని బూరెయు
వీరణములు లేని పెండ్లి వృథరా సుమతీ. 11

క. కాంచవు నరుసంగతిచే
సంచితముగఁ గీడువచ్చు నది యెట్లన్నం
గించిత్తు నల్లిగఱచిన
మంచమునకుఁ జెట్లువచ్చు మహిలో సుమతీ. 12

క. గడనగలమగనిఁ జూచిన
నడుగడుగున మడుఁగులిడుదు రతివలు తమలోఁ
గడ నుడుగుమగనిఁ జూచిన
నడపీనుఁగు వచ్చెనంచు నగుదురు సుమతీ. 13

క. తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకురక్ష దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ. 14

క. తనయూరి తపసితనమును
తనపుత్రుని విద్య పెంపుఁ దనసతిరూపుం
దనపెరటి చెట్టుమందును
మనసున వర్ణింప రెట్టిమనుజులు సుమతీ. 15

క. తనకలిమి యింద్రభోగము
తనలేమియె సర్వలోక దారిద్ర్యంబుఁ
దనచావు జలప్రళయము
తనవలచినయదియె రంభ తథ్యముసుమతీ. 16

క. తానను భవింప నర్థము
మానవపతిఁ జేరుఁ గొంత మఱిభూగతమౌఁ
గానల నీఁగలుగూర్చిన
తేనియ యొరుఁ జేరునట్లు తిరముగ సుమతీ. 17

క. ధీరులకుఁ జేయుమేలది
సారంబగు నారికేళ సలిలము భంగిఁ
గౌరవమున మఱిమీఁదట
భూరిసుఖావహముసగును భువిలో సుమతీ. 18

క. నవరసభావాలంకృత
కవితాగోష్ఠియును మధురగానంబును దా
నవివేకి కెంత చెప్పినఁ
జెవిటికి సంకూఁదినట్లు సిద్ధము సుమతీ. 19

క. పగవల దెవ్వరితోడను
పగవంగావలదు లేమి వచ్చినపిదపం
దెగనాడవలదు సభలను
మగువకు మనసియ్యవలదు మహిలో సుమతీ. 20

క. పరనారీసోదరుఁడై
పరధనముల కాసపడక పరులకు హితుఁడై
పరులు తనుఁబొగడ నెగడియుఁ
బరు లలిగిన నలుగనతఁడు పరముఁడు సుమతీ. 21

క. మండలపతి సముఖంబున
మెండైన ప్రధాని లేక మెలఁగుట యెల్లం
గొండంత మదపుటేనుఁగు
తొండము లేకుండినట్లు దోఁచుర సుమతీ. 22

క. మంత్రిగలవాని రాజ్యము
తంత్రము సెడకుండ నిలుచుఁ దఱుచుగ ధరలో
మంత్రివిహీనుని రాజ్యము
జంత్రపుఁగీ లూడినట్లు జరగదు సుమతీ. 23



# దాశరథిశతకము.

ఉ. శ్రీరఘురామ చారుతుల
సీదళదామ శమక్షమాదిశృం
గారగుణాభిరామ త్రిజ
గన్నుతశౌర్యరమాలలామ దు
ర్వారకబంధరాక్షసవి
రామ జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 1

ఉ. రాముఁడు ఘోరపాతక వి
రాముఁడు సద్గుణకల్పవల్లికా
రాముఁడు షడ్వికారజయ
రాముఁడు సాధుజనావనవ్రతో
ద్దాముఁడు రాముఁడే పరమ
దైవము మాకని యెంచి యుద్గుకెం
దామర లే భజించెదను
దాశరథీ! కరుణాపయోనిధీ! 2

ఉ. అండజవాహా నిన్ను హృద
యంబున నమ్మిన వారిపాపము
ల్కొండల వంటివైన వెసఁ
గూలి నశింపకయున్నె, సంతతా

ఖండలవైభవోన్నతులు
గల్గఁగఁజేయుమానుమని మోక్షలక్ష్మికై
దండ యొసంగకున్న తుది
దాశరథీ! కరుణాపయోనిధీ! 3

ఉ. జుట్టెద మీకథామృతము
జుట్టెద మీపదకంజతోయమున్
జుట్టెద రామనామమున
జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుట్టెద జుట్టజుట్టగ రు
చుల్గనువారి పదంబుఁగూర్పవే
తట్టలతోడి పొత్తిడక
దాశరథీ! కరుణాపయోనిధీ! 4

ఉ. నీలఘనాభమూర్తివగు
నిన్నుఁ గనుంగొనఁ గోరి వేఁడినన్
జాలము సేసి డాఁగెదవు
సంస్తుతికెక్కిన రామనామ మే
మాలనుడాఁచుకోఁగలవు ?
ముక్తికిఁ బ్రోవది, పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల
దాశరథీ! కరుణాపయోనిధీ! 5

ఉ. వలదు పరాకు భక్తజన
వత్సల! నీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు
వజ్రమువంటిది కావకావకే
వలదు పరాకు నాదురిత
వార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁతునెకా నిరంతరమా
దాశరథీ! కరుణాపయోనిధీ! 6

ఉ. తప్పులెఱుంగలేక దురి
తంబులు చేసితినంటి, నీవు మా
యప్పవు కావుమంటి, నిఁక
నన్యులకున్ నుడుగంటనంటి, నీ
కొప్పిదమైన దాసజను
లొప్పినబంటుకు బంటనంటి, నా
తప్పులకెల్ల నీవెగతి
దాశరథీ! కరుణాపయోనిధీ! 7

ఉ. భూపలలామ రామ రఘుపుంగవరామ త్రిలోకరాజ్య సం
స్థాపనరామ మోక్ష ఫలదాయక రామ మదీయపాపము
ల్బాపగదయ్య రామ నినుఁబ్రస్తుతి సేసెదనయ్య రామ సీ
తాపతి రామ భద్రిగిరిదాశరథీ! కరుణాపయోనిధీ! 8

# కుమారీశతకము

క. మగనికి నత్తకు మామకుఁ
దగసేవ యొనర్చుచోటఁ దత్పరిచర్యన్
మిగుల నుతిబొందుచుండుట
మగువలకుంబాడి తెలిసి మసలు కుమారీ! 1

క. పరపురుషు లన్నదమ్ములు,
పరుఁడే దైవంబు, తోడిపడుచులు వదినల్
మఱఁదండ్రి నత్తమామలు
ధరఁ దల్లియుఁ దండ్రియనియుఁ దలఁపు కుమారీ! 2

క. మఱఁదండ్రి వదినె లత్తలు
కుఱఁదులు బావలకొమాళ్లు మఱి పెద్దలురా
నురవడిఁ బీఁటలు మంచము
లరఁగులు దిగుచుండవలయు నమ్మ కుమారీ! 3

క. జపములు గంగాయాత్రలు
దపములు నోములును దానధర్మంబులుఁ బు
ణ్యపురాణముఁ బతిభక్తికి
నుపమింపఁగ సాటిరాకయుండు కుమారీ!

క. ధనహీనుఁడైనఁ గడు దు
ర్జనుఁడైనఁ గురూపియైన జడమతి యైనన్
విను మెట్టిఁడైన నెప్పుడుఁ
దనపతియే తనకు దైవతంబు కుమారీ! 5

క. ధనవంతుఁడైన యప్పుడు
పెనిమిటి చిత్తం బెఱింగి ఘండ్లాము మెలం
గుము, లేమి మెలఁగ నేర్చిన
వనితకు లోకమున వన్నెవచ్చు, కుమారీ! 6

క. కడుపారఁ గూడుఁ గూరలుఁ
దొడవులు వస్త్రములు మిగుల దొరకవనుచుఁ దా
పడితనమునఁ బెనిమిటితో
నెడఁబాసి చరింపఁగూడ దెప్పుడు, కుమారీ! 7

క. అత్తపయి న్మఱఁదలిపయి
నెత్తినకోపమున బిడ్డ నేడ్పించుటకై
మొత్తినఁ దనకే కీడగుఁ
జిత్తములో దీనిఁ జింతసేయు కుమారీ! 8

క. మగనిప్రియమెచ్చె ననుచును
దెగ నీలిగి యింటివారి దిగఁ ద్రొక్కుచు దుం
డగురా లయి తిరిగిన వరి
మగువలలో నిదియె తప్పుమాట కుమారీ! 9

క. జీవములు భర్తపదరా
జీవము లని చిత్తమందు చింతించిన ల
క్ష్మీవల్లభుచరణంబుల
సేవ లతాంగులకు నెమ్మిఁ జేయు, కుమారీ! 10

క. పుట్టింటివారి నీచతఁ
బెట్టకు మత్తింటివారు పెట్టెడిబాధల్
పుట్టింటఁ దెలియ నియ్యకు
ఱట్టడిచెలి యందు రదియె అవ్వ కుమారీ ! 11

క. ఇక్కడి దక్కడ నక్కడి
దిక్కడఁ జెప్పినను వారి కిద్దఱికిఁ బగ
లొక్కెక్కనఁ గని చేడియ ల
మ్మక్కల యిడుమల్లమారి యందురు కుమారీ ! 12

క. కొన్నాళ్లు సుఖము కష్టము
కొన్నాళ్ళనుభవము లేక కొఱగాదు సుమీ
పున్నమదినముల వెన్నెల,
లెన్నంగ నమాసలందు నిరులు కుమారీ! 13

క. విసువకు పని తగిలినయెడఁ
గసరకు సేవకుల మిగులఁ గాంతునితోడన్
రొసరొసపూనకు మాడకు
మసత్యవచనంబు లెన్నఁడైన, కుమారీ ! 14

క. ఎంతటి యాఁకలి కలిగిన
బంతిని గూర్చుండి ముందు భక్షింపకు సా
మంతులు బంధువులును నిసు
మంతైనను జెల్ల దందురమ్మ! కుమారీ ! 15

క. గురుశుక్రవారముల యం
దిరగేహాళులందు లక్ష్మి తిరముగ నిలుచుం
గరగరిక నలికి ముగ్గిడి
గురుభక్తి మెలంగఁ బాయుఁ గొదవ కుమారీ! 16

క. అపకీర్తిం బొందుట క
ష్టపుఁబనిగా దొక్క గడియ చాలును, గీర్తిన్
నిపుణత వహింపవలయును
జపల గుణములెల్లఁ బాసి చనఁగ, కుమారీ! 17

క. గొప్పదశ వచ్చె ననుచు నొ
కప్పుడయిన గర్వపడకు మదిఁ దొలఁగినచోఁ
జప్పట్లు చఱతు రందఱుఁ
దప్పనుమీ యట్లు సేయఁ దగదు కుమారీ! 18

క. సుమతియును జంద్రమతియును
దమయంతియు జానకియును ద్రౌపదియును బ
న్నములం బడి పతిభక్తిం
గ్రమము నడపుటలు తలంపఁగాదె? కుమారీ! 19

క. వాణియు శర్వాణియు హరి
రాణియు వాక్కనను మైనురంబున నుంటల్
రాణఁ దిలకించి మదిలోఁ
బాణిగ్రాహియెడ నిల్పు భక్తి కుమారీ! 20

క. వడ్డించునపుడు తాఁ గను
బిడ్డలకుం దల్లిభంగి ప్రేమదలిర్పన్
వడ్డింపవలయు భర్తకు
నెడ్డెతనము మానవలయు నెందు కుమారీ! 21

క. ఆలోచన యొనరించెడి
వేళలలో మంత్రిభంగి వివరింపవలెం
గాలోచితకృత్యంబుల
భూలోకమునందు గీర్తిఁ బొందు కుమారీ! 22

క. దానములు ధర్మకార్యము
లూనంగాఁ గలిగినంత యుక్తక్రియలన్
మానవతుల కిదిధర్మము
గా నెఱిఁగి యొనర్పవలయుఁ గాదె కుమారీ! 23

క. శ్రమ యెంత సంభవించిన
క్షమ మఱువఁగరాదు ధరణిచందంబున స
త్యమునఁ బ్రవర్తించినయా
రమణియె లోకంబునందు రమణి కుమారీ! 24

క. పరజనము లాచరించెడి
దురితంబునఁ గ్రోధగుణము దోఁచెక నధిక
స్ఫురణన్ క్షమ గైకొనినం
దలఁగు నది యెఱింగి మెలఁగ దగును కుమారీ! 25

క. కులమున విత్తంబున వి
ద్యలను ముదం బుద్భవించు నాయాపెంపుల్
దలపోయ మరలు నీదిహృ
జ్జలజంబులఁ దలఁపవలయు సతము కుమారీ! 26

క. మాత్సర్య మొదవు సత్త్వము
హృత్సరసీజమున లేమి నెల్లప్పుడు దా
సత్సేవయందు దిరిగిన
మాత్సర్య మణంగుఁ దెలిసి మసలు కుమారీ! 27

క. బహుకష్టములం బొందక
మహిలో సమకూడఁబోదు మానవజన్మం
బహాహా యీజన్మంబున
నిహపరములఁ గొనెడుజాడ లెఱుఁగు కుమారీ! 28

క. దీపములనీడ మానవ
రూపంబుల నీడ శనితరులనీడను ఖ
ట్వాపాదిత మగునీడల
నేపట్టున నిలువఁగూడ దెపుడు కుమారీ! 29

క. ఈరీతిఁ దిరుగనేర్చిన
నారీమణి కీర్తిఁ బొందు నరలోకమునన్
దూఱులు తొలంగి పోవును
ఘోరచరితసంఘ మెల్లఁ గుందు కుమారీ! 30

# గుణము.

సీ. అరుణోదయం బెఱు, పరుణాచలం బెఱు
పక్కమండల మెఱు, పగ్ని యెఱుపు,
బ్రిహ్మదేవుం డెఱ్ఱ, బంధూకసుమ మెఱ్ఱ,
పద్మరాగం బెఱ్ఱ, పద్మ మెఱుపు,
ఇంద్రగోపం బెఱు, పిందిరాపతి యెఱ్ఱ,
దొండపం డెఱుపు, సిందూర మెఱుపు,
పాకశాసనుఁ డెఱ్ఱ, పవడంపుఁదీ వెఱ్ఱ,
కుంకుమపూ వెఱ్ఱ, కుంకు మెఱుపు,
రమణీయధర మెఱుపు, రాచిల్కముక్కెఱ్ఱ,
లత్తుకరస మెఱ్ఱ, లక్క యెఱుపు,
ఎఱుపుఁ జెప్పనేల యింతికి మేలైన
గుణము గలిగెనేని కోటిసేయు. 1

సీ. శ్రీతరుణీపతి పీతాంబరము పచ్చ,
కమలనేత్రుని తురంగంబు పచ్చ,
దేవతాకాంతల దేహకాంతులు పచ్చ,
ఘనమైన పుష్యరాగంబు పచ్చ,
పదియాఱువన్నియ బంగార మది పచ్చ,
పరిపక్వ జంబీరఫలము పచ్చ,
తఱచుగాఁ బూచిన తంగేడుపువ్వు పచ్చ,
చాలఁ బూచినయట్టి రేల పచ్చ,

వాసిమీఱు తమ్మికేసరములు పచ్చ,
పండుటాకు పచ్చ, పసుపు పచ్చ,
పచ్చ చెప్పనేల ? పడఁతికి మేలైన
గుణము గలిగెనేని కోటిసేయు. 2

---

# పొడుపుపద్యములు

ఆ. ఆకసమున నుండు నది పక్షియును గాదు
తోఁక గల్గియుండు మేఁకగాదు
త్రాడుఁ గలిగియుండుఁ దలఁప నెద్దును గాదు
దీనిభావ మేమి? తిరుమలేశ! 1

(గాలిపడగ)

ఆ. కడుపు మిగులఁ బెద్ద, కాళ్లుసేతులు లేవు
కంటఁ గూడు మెక్కు, కలహాకంఠి
అంటిన మొఱపెట్టు నది యేమిచోద్యమో
దీనిభావ మేమి? తిరుమలేశ! 2

(మద్దెల)

ఆ. అష్టబాహు లలరు, నది రక్కసియుఁ గాదు
వెలయు జన్నిదంబు ద్విజుఁడు గాఁడు
తోఁక నుండుఁ జెవులు, తుమ్మెదవలెఁ బాడు
దీని భావ మేమి? తిరుమలేశ! 3

(ఏకులరాట్నము)

ఆ. ఇనుఁ జూచిన వికసించును,
మనుకొని శీతాంశుఁ జూచి ముకుళించునయా
తనుఁగొనఁ గమలము గా దది,
పనిపడి ముఖ్యముగ నుండుఁ బాంధులయొద్దన్. 4

(గుడ్డగొడుగు)



# లఘు టీక

## ౧ వేమనశతకము

పద్యము (1) మలయజము=మంచిగంధపుఁజెట్టు (మలయపర్వతమునఁ బుట్టినచెట్టు); కొఱగాఁడు=లెక్కలోనికి రానివాఁడు (అగును.) (6) తీర్పరితనము=న్యాయమును దెలుపుపెత్తనము. (7) తగవేది=ధర్మముతప్పి; ఆప్తులన్=కావలసినవారిని; చెనఁటినరుఁడు=వ్యర్థుఁడైనమనుష్యుఁడు. (9) అనయంబుఁ=మఱిమఱి; (10) ఉసురు—ప్రాణము; ఉసురుమన్నన్=ఉస్సురు మని బాధపడినయెడల; పెనుమంటలు=పెద్దమంటలు; తేనెతెర=తేనెపట్టు, సుమరసంబు=పూఁదేనె; భ్రమరము=తుమ్మెద. (13) రాజిల్లి=ఒప్పి; పానయోగ్యము=త్రాగుటకుఁ దగినది; సాంగత్యమునఁ జేసి=స్నేహముచేత; మూఢజనుఁడు=తెలివిమాలినమనుష్యుఁడు; సుగతిన్=మంచిమార్గమును; పొనయున్=పడయును. (15) తరువన్ తరువఁగ=మథింపఁగా మథింపఁగా; అనలంబు=అగ్ని; దధిన్=పెరుఁగునందు; ఘృతము=నేయి. (16) ఎడ్డె=తెలివితక్కువవాఁడు; మొప్పె=మొండివాఁడు. (18) వక్రభాషణములు=వంకరమాటలు; మొఱకు=మూర్ఖుఁడు; చందనతరువంబున్=మంచిగందపుఁజెట్టున. (19) శ్రవణపుటములు=చెవు లనియెడు దొప్పలు; సార్థక్యము=సఫలత్వము—ఫలముతోఁగూడియుండుట; విశదము=తెల్లము (స్పష్ట

మైనది). (20) పికము=కోయిల; వనము—అడవి; పెల్లుగాన్=అధికముగా, భంగిన్=విధముగా; ప్రాజ్ఞజనులు=తెలివిగలనరులు; కలుషాత్మవచనంబు=పాపాత్మునిమాట. (21) బహుళకావ్యములన్ =అనేక పుస్తకములను; శబ్దచయము=పదముల సమూహము, సహనము=ఓర్పు; అబ్బున్=అలవాటగుట, (22) ముఖ్యులు= ప్రధానులైనవారు (తలిదండ్రు లని భావము); సన్నుతించి=స్తోత్రముచేసి (పొగడి); సంతతమున్=ఎల్లప్పుడును; జ్ఞానదాతన్=తెలివినిచ్చినవానిని(గురువు); (23)విబుధులు=బాగుగాఁ దెలిసినవారు (పండితులు); కొలన్=నరస్సు (చెఱువు) నందు; కొక్కెర=కొంగ. (24) కనకపర్వతము=బంగారుకొండ (మేరువు); అమరవిభున కైనన్=దేవేంద్రున కైనను; కుండలములు=పోఁగులు (మగవారు చెవులందు ధరించెడి యొకవిధమైన భూషణములు); అర్థింపఁడా=యాచించినవాఁడు గాఁడా? (కోరుకొనె నని భావము.) పుత్తడి=మేలిమిబంగారము (విశేషధన మని భావము). (25) వెలయదు=ప్రకాశింపదు (వెల్లడిలోనికిరాదనుట). (27) గుణయుతునకున్=మంచిగుణములతోఁగూడినవానికి; (28) చాంచల్యము=నిలుకడలేనితనము; తివురుభానున్—ఉదయింపఁబోవు సూర్యుని; తిమిరంబు=చీకటి. (29) జక్కి=గుఱ్ఱము; కాపురుషులు=తక్కువ (నీచగుణములుగల) నరులు. (30) రవికులము=సూర్యవంశము; కురుపతి=దుర్యోధనుఁడు. (31) క్షమ=ఓర్పు.

## ౨ సుమతీశతకము

పద్యము (2) దెప్పరమై=సహింపరానిదై. (3) ఆఁకొన్న=ఆఁకలిగొనిన; తాఁకు=అడ్డము; సోఁకు=కీడు; తేఁకువ=ధైర్యము; (5) హయము=గుఱ్ఱము; మత్తేభంబున్=(మత్త+ఇభము) మదించిన యేనుఁగును; మొదవు=ఆవు; వృషభము=ఎద్దు. (6) ఉపమింపన్=సరిపోల్పఁగా; ఎడనెడన్=నడుమనడుమ; నెపములు=నేరములు; దుర్జాతిపొందు=దుష్టుని స్నేహము. (8) తీర్పరి=న్యాయమును చెప్పువాఁడు; కకవికలు=గందరగోళము; (9) ఒరగాలు=ఒరగినకాలు (అవిటి కాలు); తులువ=దుష్టురాలు; ముప్పునన్=ముసలితనమునందు; (11) ప్రేరణము=ప్రేరేపణ (బుజ్జగింపు). (13) గడన=సంపాదనము; నడపీనుఁగు=నడచెడుశవము. (15) తపసితనము=తపోనిష్ఠ గలిగియుండుట. (16) ఇంద్రభోగము=ఇంద్రుని సౌఖ్యమువంటిది; లేమి=బీదతనము; సర్వలోకదారిద్ర్యంబున్=అన్నిలోకముల బీదతనమును; జలప్రళయము=(సృష్టియంతయు) జలమయమై మునిఁగి నాశనొందుట. (17) ధీరులకున్=పండితులకు; భూరిసుఖావహము=మిక్కిలి మేలును గలిగించునది. (19) నవరస...గోష్ఠియున్=శృంగారాది రసములచే నలంకరింపఁబడిన కవిత్వము గల ప్రసంగమును. తంత్రము=ఉపాయము; జంత్రము=గుంత్రము.

## ౩ దాశరథిశతకము

పద్యము:—(1) శ్రీరఘురామ=శోభాయుక్తుఁడవైన రఘురాముఁడా; చారుతులసీదళధామ=సుందరమైన తులసీదళములదండగలవాఁడా! (ధరించినవాఁడా యనుట); శమ, క్షమాది, శృంగారగుణాభిరామ=ఇంద్రియములను జయించుట, ఓర్పు మొదలుగాఁ గల ప్రధానగుణములచే నొప్పుచుండువాఁడా; త్రిజగన్నుతశౌర్య రమా లలామ=మూఁడులోకములచేతను పొగడఁబడిన శూరత్వ మనియెడి శ్రేష్ఠమైన లక్ష్మిగలవాఁడా (రమా=లక్ష్మి; లలామ=శ్రేష్ఠమైన); దుర్వార కబంధ రాక్షస విరామ=అడ్డగింపరాని కబంధుఁడనియెడి రక్కసు నణఁగించినవాఁడా; జగజ్జన కల్మ షార్ణ వోత్తారక నామ=లోకుల పాపసముద్రమును తరింపఁజేయునట్టిపేరు గలవాఁడా! భద్రగిరిదాశరథీ=భద్రాచలమునం దుండెడి దశరథరాజకుమారుఁడా! (రాముఁడా); కరుణాపయోనిధీ=దయాసముద్రుఁడా? (2)సద్గుణకల్పవల్లికా+ఆరాముఁడు=మంచిగుణము లనియెడు కల్పలతలకు ఉద్యానవనమువంటివాఁడు; షడ్వికారజయరాముఁడు=కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము నను ఆఱువికారములయొక్క జయముచేత నొప్పువాఁడు; సాధుజన+అవనవ్రత+ఉద్దాముఁడు=సాధువులను రక్షించుట యను నియమము గలవారిలో ముఖ్యుఁడు; అడ్గుకెందామరలు=ఎఱ్ఱదామరలవంటిపాదములు. (3) అంచవాహా=(బ్ర)[illegible]

పుట్టిన) గరుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడా! సంతత + అఖండలవై భవ + ఉన్నతులు=ఎడతెగని, యింద్రునిభాగ్యము వంటి భాగ్యముయొక్క పెంపులు; కై దండ—చేయూఁత. (4) పదకంజతోయములు = పాదపద్మములయొక్క యుదకమును; తజ్జులతోడిపొత్తు=నీచులతోడి సహవాసము. (5) నీలఘనాభ మూర్తివి=నల్లనిమబ్బు (కాంతివంటి)కాంతిగల శరీరము గలవాఁడవు; పాపమూలకుద్దాలము=పాపము లనియెడి (చెట్టు) వేళ్లకు త్రవ్వుకోల. (6) భక్తజనవత్సల=భజించువారియందు ప్రేమము గలవాఁడా! దురితవార్థి=పాపసముద్రము; (7) అప్పవు=తండ్రివి; నుదుగంటనంటి=నమస్కరింప నంటిని. (8) భూపలలామ=రాజశ్రేష్ఠుఁడా! త్రిలోకరాజ్యసంస్థాపనరామ=(రావణాది దుష్టరాక్షసులను సంహరించి) మూఁడులోకముల రాజ్యములను నిండుగా (ఈతిబాధలు మొదలగునవి లేకుండ) నిలిపిన వాఁడ వగురాముఁడా! మోక్షఫలదాయక=ముక్తిఫలమునిచ్చు వాఁడా!

## ౮ కుమారీశతకము

(1) తత్పరిచర్యన్=వారిసేవయందు. (3) ఉరవడిన్=శీఘ్రముగా (10) పదరాజీవములు=పాదము లనుపద్మములు. (11)జట్టడిచెలి=గయ్యాళిస్త్రీ. (16)మందిరగేహాళులు=ఇల్లును, గడపలును; గరిగరికన్=నిర్మలత్వముతో; గురుభక్తిన్=(లక్ష్మిదేవియందు)మిక్కిలి భక్తితో; కొదవ=(పేదతనములో)నగుల్లో

పము. (19) బన్నములు=కష్టములు. (20) వాణి=సరస్వతీదేవి; శర్వాణి=పార్వతీదేవి; హరిరాణి=(విష్ణునిభార్య) లక్ష్మీదేవి; వాక్కునన్=మాటయందు (నోటియందనుట); మైన్=శరీరమునందు; ఉరమునన్=వక్షము (ఱొమ్ము)నందు; రాణన్=ముదముతో; పాణిగ్రాహి=(నీ)చేతిని బట్టినవాఁడు=భర్త. (22) కాలోచితకృత్యంబులన్=(ఏవేళ కేదితగునో ఆ) వేళకుఁదగినకార్యములచేత. (23) యుక్తక్రియలున్=తగినకార్యములును. (24) ధరణిచందంబునన్=భూదేవివిధమున. (25) దురితము=పాపము; క్రోధగుణము=కోపగుణము; అధికస్ఫురణన్=ఎక్కువతెలఁపుతో; క్షమన్=ఓర్పును; తఱుఁగున్=తగ్గిపోవును; (26) హృజ్జలజంబునన్=మన స్సనియెడి తామరయందు (జలజము=నీటఁబుట్టినది.) (27) మాత్సర్యము=(ఇతరులభాగ్యాదులను జూచి) ఓర్వలేమి; సత్త్వము=సాధుత్వము (మంచితనము); హృత్సరసిజమునన్= హృదయపద్మమునందు; లేమిన్= లేకపోవుటచేత; సత్సేవ=మంచివారిని కొలుచుట. (29) శనితరులు=తాండ్రమొదలచెట్లు; ఖట్వాపాదితము—ఖట్వ=మంచమువలన,—ఆపాదితము=కలిగింపఁబడినది. (30) దూఱులు=నిందలు, ఘోరదురితసంఘము=భయంకరమైన పాపముల సమూహము.

---